## సిరిసిల్లాతాలూకాలో పంటల దుస్థితి

సిరిసిల్ల, ఆబాన్ ౧౩౪౯ ఫ

(స్వ. వి.)

ఈతాలూకా కరీంనగరం జిల్లాలో చేరినది. ౧౯ తవత్సరము ప్రభుత్వమువారు కొన్నితాలూకాలతో పాటు ఈతాలూకాలో "కరవుకాలము" కలిగినదని ప్రకటించిరి గతసంవత్సరము కొద్దో గొప్పో స్వల్పధాన్యములభించినది. కాని ఈసంవత్సరము నిరాశ తాండవమాడుచున్నది. ఈ సంవత్సరము మృగశిరలో వర్షముకురిసినప్పాగ్గిర, ఆరుద్రలలో అన్నివిత్తనములు భూమిలో పడవేసిరి. పునర్వసుమొలకలుకొని మఘసగము పాదమువరకు ముసురుకురిసి చేన్లన్నీ జాలు పట్టినవి. మఘచివర సగము సాదము మొదలు నేటివరకు ఒకచినుకైనాలేదు, చేలన్ని ఎండిపోవుచున్నవి. విపరీతముగా ఎండకాయుచున్నది.

మొక్కజొన్నపైరు ఈబీదల ప్రాణాధారము, ఆరుద్రకార్తిలో విత్తబడినది. కొంచెముపెరిగినది మొదలు ముసురుప్రారంభమై సాలుపడనివ్వలేదు. కొందరు ముసురులోనే సాళ్లుపెట్టిరి మొదలు జాలుపట్టినది. ఇప్పుడు ఎండుచున్నది. భావులాధారముకలవారు మోటలుతోలి, తోడుకొని పైరునుకాపాడుచున్నారు. పచ్చజొన్న, నువ్వు, ఆముదాలు, పెసళ్ళగతిపూడ మరీఅన్యాయమైపోయినది.

ఈతాలూకాలో పెక్కుచోట్ల మఘకార్తివరకు నీరు రానందున మాగాణివిత్తబడలేదు. విత్తబడి వరికొద్దిపైరు పచ్చపురుగుమన్నగుకీటకము నశాపాలుచేయుచున్నది. వర్షములేకున్న ఒకవిత్తులభించదు.

## హత్య

(స్వ-వి)

సిరిసిల్ల ఆబాన్ ౩

ఈ ఠమురోజులక్రిందట మ॥ నిజాంబాద గ్రామములో ఒకబ్రాహ్మణవిధవరాలు తనభర్తయొక్క సాంవత్సరికమున్నది, అందరు భోజనాలకు రండనిచెప్పెను. వంటబ్రాహ్మణునకుగూడ రేపువంటచేయరానలయునని చెప్పి, వంటసామగ్రులన్ని సిద్ధముచేసుకొని ఒంటరిగానే తనగృహములోనిద్రించుచుండ, ఎవడో కిరాతకుడువచ్చి హత్యచేసి సొమ్ములన్నీ అపహరించి, శవమును భావిలోపడవేసిపారిపోయెను, తెల్లవారి వంట బ్రాహ్మణులు వంటచేయనచ్చువరకు తలుపులు మూసియుండ పిలిచి గొంతుపాడై గోడమీదినుంచిఎక్కిచూచేవరకు హత్య. పోలీసువారలకు తెలియగా పంచాలయుక్తం విచ్చేసిచూచిరి హంతకుడు నేటివరకుదొరకలేదు.



## మతశాఖమంత్రిగారి ఆగమనము

(స్వ-వి)

సుల్తానాబాద, ఆబాన్ ౨

నేడు మతశాఖమంత్రిగారగు అబ్దుల్ అజీజుగారు ౧౧ గంటలకువిచ్చేసిరి. కచ్చేరినిచూచి కొందరి వకీళ్ళతోకలసిరి. త్రోవలోనే శ్రీవేణుగోపాలస్వామి దేవాలయముకలదు. చిన్నపెద్ద అందరు భజనసలుపుచుండిరి, మంత్రిగారు దేవాలయములో ప్రవేశించిరి అర్చకుడు పూలహారము వేసి ప్రసాదమిచ్చెను మంత్రిగారు ప్రసాదముతీసుకొనిరి. పిల్లవాండ్లు కష్టపడి భజనచేయుచున్నందుకు స్వంతం ఐదురూపాయిలు మిఠాయిపంచిపెట్టుటకిచ్చిరి, భావిదగ్గరకువెళ్ళి చూచిరి. పూజారితో నీకేమికోరుతవు అనిఅడిగించిరి. అందులకుపూజారి దేవళముప్రాకారము శిధిలమైపోయినది దయచేసి కట్టించవలెననిరి దీనిపై కరీంనగరం అవ్వల్ తాలుకదారు" నీవద్దరకంపున్నది" అనిఅడిగిరి. పూజారి "అయ్యా ఈగ్రామములో పెద్దనేట్లు ధనికవర్గపురైతులులేరు. అర్చకులము కడుబీదస్థితిలోనున్నాము సర్కారువారే దిక్కనెను. దీనిపై అవ్వల్ తాలుకదారు తలయూపుచు "లేదులేదు" అనుచుండ మంత్రిగారు ౨౦౦౦ రూపాయిలు ఇవ్వగలననిరి. ప్రజలందరు ఉత్సాహసాహసాకులైయనిరి. సర్కారుదేవాళయకొంపౌండు, భావిమరమ్మతుకు రెండువేయిలకలు మంజూరిచేసినారు స్వామికి ప్రాణములేనందున స్వామిభక్తుడగు శ్రీ వేణుగోపాలరావుపట్వారీగారిపేర రకంపంపుదుమనిచెప్పి మసీదునుచూడవెళ్లిరి.

మసీదులోనికివెళ్లిపేషుఇమాంగారితో అన్నిసంగతులుతెలుసుకొనిరి ఏమికోరెదవని పేషుయిమాంను అడుగగా, "మసీదులోనిభావి ఎండకాము ఎండిపోవునుకనుక వెలుపలనున్నభావికి గచ్చుకట్టించవలయును. ఈపనిని లోకల్ ఫండునుండి పూర్తిచేయించమనిరి." అవ్వల్ తాలూకుదారు తత్క్షణమే ఆసంగతి నోటుచేసుకొనిరి ఇంకేమి కోరెదవనిఅడిగిన, మసీదుకు తలుపుకావలయునన్న తగిలినపైకం పంపుదుమని వాగ్దానముచేసి తహశీలుకచ్చేరీలోకివెళ్ళిరి. వేదికమీదికి సేగేదారుచే మతశాఖమసల్లు తెప్పించి చూచిరి, తహశీలుదారు గారితో మతసంబంధమైన గృహములను తొందరగ కట్టించుము. బాగుచేయించుమనిచెప్పి కరీంనగరువెళ్ళిపోయిరి.



## వర్ణాంతర వివాహము

హైదరాబాదు(దక్కన్), ఆబాన్ ౯

భట్టురాజు కులము కన్యకయగు నాగరత్నమ్మకును బ్రాహ్మణుడు పి. కృష్ణమూర్తి అనువారికిని ఆర్యవైదిక పద్ధతిపై చంద్రపాలుగారి అధ్వర్యమున శుద్ధవైదిక మంత్రయుక్తముగా అగ్నిసాక్షిగా వివాహము హైదరాబాదునగర కిషన్ గంజులో భాద్రపద శు ౧౨ నాడు జరిగెను.

నేషనల్ న్యూస్ సర్వీస్

## నర్సంపేట గ్రంధాలయము

(ఒకవిలేఖరి)

నర్సంపేట, ఆబాన్ ౫

పాఖాల్ తాలూకా నర్సంపేటలో చలా కాలముక్రిందట ఆంధ్రగ్రంధాలయముండెను. కాని పురప్రముఖులసహాయములేనందున గ్రంధాలయంజీర్ణావస్థనుపొంది,మరియు పుస్తకాలు చెదలుపట్టి చాలానష్టంఅవుతూయుండెను. శ్రీహయగ్రీవాచారి (హన్మకొండ) గారు గ్రంధాలయాభివృద్ధికి చాలాసార్లుప్రయత్నంచేసిరి కాని లాభంలేకపోయెను. ఈసంవత్సరం ౧౭ షహరేవర్ తేదినీ శ్రీవారు స్వయముగావచ్చి అధ్యక్షుని కార్యదర్శి, సభ్యులనుచేర్చి,పోతనాంధ్ర గ్రంధాలయం, పేరు నియమించినారు. గ్రంధాలయం చాలా అభివృద్ధికి వస్తూయున్నది.

## హైదరాబాదు కొత్వాలీ నివేదిక

(నవాబ్ రహిమత్ యార్ జంగ్ బహాదర్ కొత్వాలుగారు)

౧౩౪౯ ఫసలీసంవత్సరమునాటి నగర కొత్వాలీ నివేదిక నవాబు రహమతుయార్ జంగుబహద్దరు కొత్వాలుగారిచే సిద్ధముచేయబడినట్టిది వెలువడినది. అందలి విషయాల సారాంశమిం దియ్యబడుచున్నది:—

నివేదికాకాలములో కొత్వాలీవారికి చాలా కష్టస్థితులేర్పడెను. వారికి చాలాపనులుకలిగెను. అదేసంవత్సరము సత్యాగ్రహమారంభమయ్యెను. దౌర్జన్యములుజరిగెను. రాజ్యాంగసంస్కారాలకు వ్యతిరేకంగా ప్రచారంజరిగెను. హిందూ ముస్లింకొట్లాటలుజరిగెను. కేవలం గడబిడలే కాకుండా రాజకీయవాతావరణమే మారిపోయెను. అందుచేత పోలీసువారు విరామంలేకుండా మెలుకవతో మెలగవలసివచ్చెను.

పై అంశాలనుబట్టిచూచినచో హైద్రాబాదు ప్రధాననగరంలో ప్రజాభిప్రాయాలెట్టివో ప్రత్యేకపరిస్థితులెట్టివో విశదమగును. పైన చూపించిన వ్యతిరేకాంశములున్నను పోలీసువారికిని ప్రజలకును కలసంబంధాలు మైత్రిపద్ధతిపైననే యుండెను. జనులు ఇదివరలో పోలీసువ్యారంటే ప్రబలాత్రు ... నిశ్వాసించి ... రి. అభిప్రాయము తగ్గిపోయినది. ప్రజలు పోలీసువారిపట్ల ... విశ్వాసముకలిగినది. కేసుల విచారణలో ... పోలీసువారికు ... లంబించినారు

నివేదికాకాలములో పతేశల్లోనూ ... చాలావరకు శాంతి వ్యాప్తమైనది. వ్యాప్తించుండినపరస్పరమైత్రి ... ఉభయవర్గాలలోను గాఢమైన ... పరస్పర అపోహలను అవిశ్వాసం ప్రబలెను. అందుచేత ..., ... నెలలలో అల్లరులు జరిగెను.

నివేదికకాలములో సత్యాగ్రహం ప్రారంభమగుట చాలావిచారకరమగు అంశము. హైద్రాబాదు స్టేటుకాంగ్రెసున్ను, హిందూ నాగరిక స్వతంత్రసంఘమున్ను, ఆర్యసత్యాగ్రహ సమితియున్ను సత్యాగ్రహాలుచేసెను. ఇదేయుట భయంకరకృత్యాలుచేయబడెను. ఒ కొట్లబాంబులు ప్రేల్చబడెను. ఒకడుచచ్చెను. ౯ మందికి దెబ్బలుతగిలెను. ౧౩మందినిఈ నేరములోపట్టుకొనిరి. ౯ మందికి శిక్షలుయియ్యబడెను.

ఈ కాలంలో యితర నేరాలు తక్కువయ్యెను.

వీధులలో బిచ్చగాండ్రబెడదలు చాలావున్నవి: ప్రజలునుచాలా అసహ్యపడుచున్నారు. కొత్వాలీశాసనం ౭౯ సూత్రాన్ని అనుసరించి ... కేసులను కోర్టులో విచారణకైపంపిరి. అందు ౪౩మందికిశిక్ష యియ్యబడెను. కేవలం యీబిచ్చగాండ్రనుబట్టి శిక్షించుటలో ఈరోతతగ్గదు. ఈ సమస్యను బాగు గావర్తించి తగుశాసనముకావించవలెను

పోలీసుశాఖలో కొన్ని సంస్కరణములుకావింపబడెను. ఈసాధనాలచేత వీధులలో అపాయం జరుగుట తక్కువైపోయినవి.

ప్రత్యేకశాఖలో రాజకీయసంబంధమగు రహస్యాలను తెలుసుకొనిదమ్ములకై ఏర్పాట్లుచేయబడినవి. పోలీసుజవానులలో విద్యావ్యాపకం యెక్కువైంది. ఇదివరలో నూటికి ౪౪ చదువు వచ్చినవారుండిరి. ఇప్పుడు నూటికి ౫౦మంది చదివినవారున్నారు. పోలీసుజవానులందరికిని వసతులనేర్పాట్లను ప్రభుత్వంవారు చేసియున్నారు. నివేదికాంతములో కొత్వాలుగారివిధంగా తెలిపియున్నారు.

## గోండులపై పోలీసులు కాల్చుట

### ౧౦ మందిచచ్చిరి

### ౧౩ మందికి గాయాలు

ఆసిఫాబాదు, అబాన్ ౧౧

ఆసిఫాబాదులో భాపబ్రీ ఆనేగ్రామములో గోండులు పోలీసువారిపైనను తాలూక్దారు మున్నగుఅధికారులపైనను ఎదురుబాటుచేసినవార్త యిదివరకే పత్రికలోవచ్చినది. గోండులు కొంత అడవిలోనభూమిపై ఆక్రమణం చేసుకొన్నారట దానిపైవ్యవహారంలో అడవిశాఖవారే గెలిచిరి. అటుపైరెండుమాసాలనుండి కొందరుగోండులు అల్లరిచేయుచుండిరట దీనిని నిరోధించుటకుకొందరగోండులను పట్టుకొని మరికొందరిని జమానతుపై విడుదలచేసిరి. జమానతుపైన విడుదలఅయినవారు కచ్చేరీలో హాజరుకాలేదు

౧౦ సెప్టెంబరునాడు అవ్వల్ తాలూక్దారు కొందరిపోలీసులను వెంటబెట్టుకొని వారిని పట్టుకొనబోయెను కాని ౩౦౦ గోండులవరకు వారిసెదరించిరి. తాలూక్దారు వారికి చాలావరకు బుద్ధిచెప్పినా వారువినలేరు. పైగా అంపోకమ తుపాకీతో కాల్చిరట అదృష్టవశాత్తు ఆ దెవ్వరికి ని తగులలేదట మరల రెండవమారు గోండులు తుపాకీ కాల్చిరి దానిమూలాన ఒకపోలీసు జవానుకు దెబ్బతగిలెను. అటుపై పోలీసువారు తమ తుపాకీలను గోండులపైకాల్చిరి. ఆదెబ్బలతో ౧౦ మందిగోండులుచచ్చిరి. ౧౩ మందికి గాయములుతగిలెను. ౩౧ మంది పట్టుకొనబడిరి. తక్కినవారు పారిపోయిరి.

—

"నివేదికాకాలములో పోలీసు వారికిచాలా కష్టపరిస్థితులేర్పడినవి గొప్పగొప్పసంస్కరణములు కొత్వాలీశాఖలో చేయబడినవి. నగరశాఖలో పని చాలాయెక్కువైపోయినది. ఇంకనుచాలా వేగంగా పెరిగిపోతూవున్నది. పోలీసుసిబ్బందిలో ఎక్కువఈ పయుక్తతను నిష్పాక్షికలను ఎక్కువచేయుటకై సర్వవిధాలా పాటుపడుచున్నాము".

—







## టప్పా అవసరము

—

(స్వ వి.)

జిల్లెల్ల, అబాన్ 8

ఈ గ్రామము సిరిసిల్ల తాలూకలో చేరి సిరిసిల్లస్థానమునకు చాల దూరము కలదు. తాలూకచివరసరిహద్దు. పెద్దగ్రామము.ప్రాథమిక పాఠశాలకలదు. పోలీసుఠాకా గలదు. వుత్తరప్రత్యుత్తరాలకు, చాలఇబ్బందియగుచున్నది. స్థానికులుధరాఖతుయివ్వ సంసిద్ధంగ నున్నారు, ప్రభుత్వమువారు ఈదజనులయందు కరుణించి టప్పా సౌకర్యము ఏర్పాటుచేయుదురుగాక!

పారిశుద్ధ్యము

ఈగ్రామంబాటలు చాల అధ్వాన్నముగానున్నవి. రాత్రిళ్లునడచుట కష్టము. వర్షాకాలములో చెప్పరానంతకష్టము.

ధర్మశాల

ఈగ్రామములోని ధర్మశాలను మాలిపటేలుగారు ఆక్రమించియున్నారు. ప్రయాణికులకు ఇబ్బందికలుగుచున్నది. పటేలు గారిక్కడ చేరిఇందువున్నను ఇందులో ప్రవేశించుట కడు ... యాంత్రము.

హరికేన్ ఫండు వసూలు

ఈగ్రామమునకు గిర్దావరుగారొచ్చెంచి ఈద జనులవద్ద చందాలు బాగా వసూలుచేసినారు.

—

## ఫ్రాన్సులోని ప్రజాయత్త రాజ్యతత్త్వము

"పాపులర్" అను పత్రికావిలేఖకుడు లండనులోనున్నాడు. అతడు ఫ్రాన్సులోని రాజ్యపద్ధతియొక్క తత్త్వమును పూర్వచారిత్రకాంశముల ననుసరించి యిట్లువ్రాసియున్నాడు.—

పెటైన్ ప్రభుత్వమువారు వెనుకముందు చూడకుండా మూడునెలలలో హిట్లరు మునలోకులను తమ దేశాన్ని అప్పజెప్పినారు. ఎంత ఘోరము! ఫ్రాన్సులో ధనికవర్గాలకు హిట్లరుపై యుద్ధంచేయుటకిష్టంలేదని నాకు తెలిసియుండెను. అట్లున్నా వారింతటి దేశద్రోహులౌతారని నేననుకోలేదు. ఫ్రెంచి సిపాయీలలోపం ఏమియున్నీ లేదు. వారికి మంచిసేనానులు దొరికినప్పుడు చండశౌర్యంలో పోరాడినారు,

తెటాలున జరిగినవిపత్తులో మాకు దిక్కుతోచలేదు ఇప్పుడుమరలకోలుకున్నాము. మాకు మరల ఆత్మవిశ్వాసం కలుగుతున్నది. మొదటి విషయమేమనగా ప్యారిసునగరవాసులు ఇప్పుడు నిస్పృహలోనున్నారు నాజీసిపాయీలు వీధులలో పరేడుచేయుచుండినను ఎవరున్నూ లెక్కపెట్టకుండా ఉన్నారు. నాజీలు మొదలుచూపించిన గర్వం ఇపుడుచూపించుటలేదు, ఫ్రెంచిప్రజలు నాజీలతో యెన్నటికిని రాజీపడరు. డీగాల్ పేరుచెప్పితే ఫ్రెంచివారు ఉత్సాహాంకనబరచుచున్నారు.

ఇప్పుడు ఇంగ్లిస్థానములో జనులందరును ప్రతిఘటనకు లేచియున్నారు. ఈమధ్య ఫ్రాన్సులోను దేశవిముక్తికై ప్రయత్నాలు జరుగుచున్నట్లు కనబడుచున్నవి

ఫ్రాన్సు తన ఆత్మనుకోలుపోలేదు. అనియెప్పటివలెనే ప్రజాయత్తమైఉన్నది. తనస్వాతంత్ర్యాలకై గర్వించునట్టిది. మనలవాటిని జయింమకోమటకు గాఢ ప్రయత్నములు జరుగుచున్నది. ఫ్రాన్సు ఆశ్చర్యపడకు ౧౮౭౦లో ఏర్పాటైనరాజ్యాంగాన్ని యిప్పటిప్రభుత్వం ౪ దినాలలో మంటకలిపింది. పెటైనును జర్మనులు ఫ్రెంచి హిట్లర్ అనిపిలుచుచున్నారు. ఇతని ప్రభుత్వంలో పూర్వసిద్ధాంతాలైన "స్వాతంత్ర్యం, భాతృత్వం, సమానత" అనేభావాలు విధ్వంసమైపోయినవి రాజకీయపార్టీలు తీసివేయబడినవి. వ్యాపారసంఘాలు ఎత్తివేయబడినవి వాటిస్థానంలో క్రొత్తపద్ధతులేర్పాటుఅగుచున్నవి. వీటిపై పేరూరులేని కౌన్సిల్ ఆనేవాన్ని ఏర్పాటుచేసినారు. ఇతడు నాజీలకుముఖ్యుడు, అందుచేత వీనికీపదవిదొరికింది.

ఫ్రాన్సుదేశం విప్లవాల ఉత్పత్తి స్థానం. జర్మనీవారేమిచేసినా మరల ఫ్రాన్సులో విప్లవం రాకమానదు.

---





## ఓడల నష్టాలు

మధ్యధరాసముద్రంలో బ్రిటిషు నౌకలచే లిబియాలో ఇటలీసేనలకు సామగ్రినిపోవు మూడుఓడలు ముంచివేయబడెను ఒక సేనడా డిస్ట్రాయరుచే ౨ నాకజలాంతర్గాములు ముంచివేయబడినవి

## అమెరికా వ్యవహారాలు

అమెరికా ప్రభుత్వమువారును కనడా ప్రభుత్వమువారును తమదేశములను శత్రువుల ఉపద్రవమునుండి రక్షించువిషయములో కలిసిపనిచేయుటకై మార్గములను నిర్ణయించుటకు సంయుక్తరక్షణసంఘమును ఏర్పాటుచేసియుండిరిగదా! ఆసంఘమువారి సమావేశముల రెండవవరుస సెప్టెంబరు ౧౧వ తేదినాటికి సమాప్తమైనది. రెండు దేశాలరక్షణసేనలు కలిసిపనిచేయుటకు వ్యవస్థలనువారునిర్ణయించినారు ఉభయదేశాలలో స్థాపించబడే సైనిక, వైమానిక, కేంద్రాలను సంయుక్తముగా ఉపయోగించుకొనే పద్ధతిని కూడానిర్ణయించినారు.

అమెరికాశాసనసభయగు ప్రజాప్రతినిధి సభవారు నాజీలును, ఫాసిస్టులును అమెరికాపౌరులుకాజాలరను ఒకశాసనమును సెప్టెంబరు ౧౧వ తేదిఆమోదించిరి.

ప్రజాప్రతినిధిసభయొక్క సెనేటుయొక్కయు కమిటీలసంయుక్తసమావేశంలో ౧౬౼౪ ఏండ్లవయస్సుగలవారిమాత్రమే ఇపుడువెంటనే సైనికశిక్షణకైనిర్బంధముగా పిలుపించుటకు తీర్మానించబడెను.

అమెరికావారు ఆస్ట్రేలియాదేశరక్షణవిషయమైకూడ సంయుక్తముగా పనిచేయుమార్గమును గూర్చి బ్రిటనుతోను ఆస్ట్రేలియాతోను ఆలోచించుచున్నారు.

అమెరికా రెండుప్రక్కల సముద్రాలలో నౌకలు ఉండుటకై [illegible] లక్షల డాలర్లు ఖర్చుచేయుటకు అనుజ్ఞనిచ్చేపత్రంపై రూజ్వెల్టుగారు సెప్టెంబరు ౯వ తేదినాడు సంతకముచేసిరి. ఈపత్రంవల్లనే ౨౦ లక్షల మంది సైనికులను తయారుచేయుటకుకూడ అనుజ్ఞలభించుచున్నది. అమెరికా [illegible] లక్షల డాలర్లతో ౨౦౧ ఓడలను నిర్మించుటకు ఆర్డరు యిచ్చినారు

అమెరికావారు బ్రిటీషువారికిపంపిన డిస్ట్రాయర్లను కెనడాలోని ఒకరేవువద్ద బ్రిటీషునావికులు సెప్టెంబరు ౯వతేదీ వశపరచుకొనినారు.

అమెరికావారు పెనామా కెనాలు అనబడు సముద్రప్రాంతరక్షణకై కొన్ని విమానములను పోర్టోరికో వద్దనుండుటకై పంపించినారు.

## తెలుగు మనియార్డరుల సౌకర్యము

ఒక పల్లెటూరినివాసి ఇటీవల తెలుగుమనియార్డరు ఫారములను ఉపయోగించి తనబంధులకు పంపినసైకము సరిగా వారలకు ముట్టినట్లు తెలిపి ఈతెలుగుమనియార్డరుఫారములు యిద్దేశ్యాత్తగాఅమలులోనికి వచ్చినవికాబట్టి ఇంతవరకువాటిని పల్లెటూరి ప్రజలసౌకర్యార్థము ప్రచారమునకు దెచ్చుటకై ఆంధ్రమహాసభవారు కృషిచేయవలెనని సూచించుచున్నాడు.

### పండిత శ్రీరామ శర్మగారికి దెబ్బలు

హైదరాబాదు (దక్కన్), [illegible] ఆర్యసమాజమందిరములో [illegible] ముగించి పండిత శ్రీ రామశర్మ [illegible] సెప్టెంబరు ౬వతేది సాయంత్రము ఉపన్యసించి తిరిగివచ్చునపుడు ఏడెనిమిదిమంది [illegible] కొట్టిరి. శర్మగారు గాయాలతో [illegible] పంపించివేయబడిరి.





### [illegible] వకీలుగారి ఉద్ధా[illegible]

[illegible] వకీళ్ళకూడా [illegible] కారు

### నాజీ ప్రతికూలసభ

హైదరాబాదు (దక్కన్) [illegible]

హైదరాబాదులోకొందరు [illegible] నాజీనిరసనసభచేసిరి. [illegible] నాజీలను [illegible] నాజీలను ప్రతిఘటించు ఇండియాజనము తనశక్తినంతా ప్రతిఘటించవలెనని, [illegible] ప్రపంచానికి [illegible] నాజీలను తలపోయు [illegible] వ్యాఖ్యానించిరి

